మస్త్యయుతోద్యానోద్ధితనితంబయును మత్తకాలోరుభాసితయు కూర్మచరణయు
మహాగాఢగంభీరనాభియు నవరత్నహారయు బృందారకసుందరీసందోహపరివృత
యును గుణపుంజకినిమందస్మితముఖారవిందయై జనుదెంచి యప్పారాశర్యుకు
మారునకు సంగళస్నానంబు మొదలగు బాలోపచారంబులొనరించి పోషిం
చెనంత * క॥ అరుణించుచుటసుతం। దరయంగా నారణేయుఁడు శుకరూపా।
కరనాగిగతహృత్కా। హరి వీర్యద్భూతుఁడగుట శుకుఁడనబరగెన్ * క॥ శుకు
డంబరసంచారా। శుకుఁడు సుకవిహృద్భిసప్రసూనసహస్రాం। శుకుఁడు సుగుణ
వార్ధిసుధాం। శుకుఁడిగంశుకుఁడు నాగశోభిలుచుండెన్ * వ॥ అట్లుగావున *
క॥ తను బానెయ్యమ్మునిం బ్రమునితనయునిముందట దివ్యతరమణిక్షిప్తా। జనము
నవరత్నమూతమగు। కనకపుదండంబుబడియెగగనమువంకన్ * చ॥ కమలభ
వుండుపట్టికనకంపుకమండలువిచ్చెనింద్రుతో। నమరవరేణ్యులేగిముదమొందు
చునెన్నఁడువాయనట్టి। స్త్రములిడిరారుఁలున్మనలుధాత్రిసురల్ జనుదెం
చిదీవన। క్రమముల వేదపాఠములు గైకొనిరమ్మునివర్యసూతికిన్ * చ॥ అతిశ
యమునంది శూలి ప్రమథాధిపులందరుగొల్చిరాగ మా। ర్వతిసహితంబుగా వృ
షభవాహనుఁడై చనుదెంచి బ్రహ్మసం। యుతులయి దేవతల్పొగడుచుండగద
త్తనయుఁ గమహాత్మ వా। న్వితముగ వేదరీతినుపనీతునిగా నొనరించె వేడు
కన్ * క॥ పుట్టినమాత్రనెయమ్ముని। పట్టికినిగమములు పాలుపడితండ్రికిము। న్ప
ట్టుబడెనెట్లువట్లనె। పట్టుపడెన్ తనకు దానె ప్రాప్తములగుచున్ * వ॥ ఇట్లుజ
ననమాత్రప్రాపితవేదయుక్తుండయ్యు వయ్యారణేయుండు లోకాచారపరిపా
టియవలంబించుటకై యుపాధ్యాయావరణంబు సేయందలంచి * క॥ గురు
వులగుజనుల కెల్లను। గురువులమరకోటులమరకోటుల కెల్లన్। గురుఁడు గురుండని
గురునిన్। గురునిగవరియించె శుకుఁడు గురుతరభక్తిన్ * శా॥ ఆదేవేంద్రగురుం
డు జెప్పనక్రమా। ద్యపంబున న్వేదముల్। త్వేదాంగంబులు వేదసంస్కృతులుత
ద్వాహోక్తకర్మంబులున్। వేదాంతంబులు మున్నుగాగలమహావిద్యాశేషంబు
లు। న్వేదవ్యాసుతుండు బాజపవెవేవేగన్సుసూత్రంబుగన్ * క॥ మరిగురుస

మాలినీవృత్తము.

మధుమురపదభంగా మానినీహృత్పద్మభృంగా। మధురమృదులభాషా మామతా సంశవేషా। నిగమజనవనమూర్తా నిత్యశుద్ధస్ఫూర్తా। బుధనుతగుణసారా భూమిజాప్రాణనాథా ॥ ... ... ... ... ❋

గద్యము.

ఇతి శ్రీసద్గురులింగమూర్తి చరణకమల సేవా విధేయ తద్గురుకటాక్ష వీక్షణానుగ్రహోపలక్షిత శ్రీగాయత్రీమంత్రోపాసనాప్రకర జ్ఞానధౌరేయ తన్మంత్రాధిష్ఠానదేవతాతత్త్వానుసంధాన లక్షణభాగధేయ వేదాంత కవితా విచిత్ర విధేయ బ్రహ్మవిద్విజ్జనగేయ పరశురామపంతుల రామమూర్తినామధేయ ప్రణీతంబయిన శుకచరితంబను వేదాంతగ్రంథంబునందు ద్వితీయాశ్వాసము ॥ ... ... ... ... ... ❋



శుకచరిత్రమునందలి

ద్వితీయాశ్వాసము

ముగిసెను.



శ్రీరస్తు



శ్రీహయగ్రీవాయనమః

శ్రీసీతారామచంద్రగురుపరబ్రహ్మణేనమః

# శుకచరిత్రము

## తృతీయాశ్వాసము.



శ్రీశుచ్యాభగుణగణమా। యామానుష దేహధరణయాగోద్ధరణా।
హేమాభరణసుజనహ్యా। త్సీమాణవసీతకిరణ సీతారమణా ✻

గీ॥ అవధరింపుము పాండుపుత్రాగ్రజునకు। నాకుగాపుత్రుడిట్లనియానతిచ్చె। తండ్రి జెప్పినసద్బుద్ధిదలచి శుకుడు। బుద్ధిలోనిట్టులనితలపోయదొడగె ✻ క॥ నిత్యంబగుపరమార్థము। నిత్యంబనితలచి తెలియనేరనిమర్త్యుల్। నిత్యము గానిప్రపంచము। నిత్యంబనికాంచిమమతనిలుపుదు రెపుడున్ ✻ ఉ॥ నిత్యమె దేహ గేహములునిత్యమెపత్నిసుతాదులర్థముల్। నిత్యమె వస్తువాహనములు నిత్యమె పల్లెలుపట్టణంబులు। నిత్యమె దేశకాలములు నిత్యమె రాజ్యవిభూతిలోకముల్। నిత్యమె భూతముల్ప్రకృతినిత్యమె వేద్యదినెంచిచూడినన్ ✻ వ॥ అదియట్లుండేని ✻ సీ॥ తనువునిత్యంబనితలపోయనదియునుగర్భంబునందొక్కకరణినుండు। నుదయమొందినయప్పుడొకచందమునసుండు బాల్యంబునందొక్కవగిదినలరు। కౌమారమున నొక్కకైవడి భాసిల్లుజవ్వనంబుననొక్కసరణి వెలయు। వార్ధకంబున నొక్కవడువునవిలసిల్లు మరణంబునందొక్కమాడ్కి దనరు। నట్లుదనరుచున్నదినిత్యమనదగు। నాదివిభులభస్మమగుచుదనరు। గాన

బుద్బుదంబుగనతిస్థిరంబనిత్యంబు నిశ్చయంబు దలచిచూడ॥ క॥ మందిరము
లునిత్యంబని॥ డెందంబున దలపనవియు డిందుపడంగా। నందరుగానరె కను
గొ। న్నందుకవని సాక్షి మరలనవిగిట్టుట యున్॥ ఉ॥ పత్నిసుతాదులెల్లపుడు
బాయకయుండుటనిత్యమంటిమా। పత్నిసుతాదులెప్పుడమి ప్రాణికియో
గమునొందిరేని తా। పత్నిసుతాది దేహములు పావకకీలలగాల్పనొప్పుచున్। వ్య
త్నముతోడతీరములయందు తపంబొనరింపజూడమే॥ గీ॥ ధనము నిత్యమని
న ధనము సంపాదించి। దాచువాడొకండు తదనుభవము। గాంచువాడొకం
డుగాక యెవ్వనిధనమెవ్వడనుభవించు నెంచిచూడ॥ క॥ వస్తువాహనములు
వచ్చునే కోరిన। వచ్చువేళ తానె వచ్చువదలి। పోవుతరిని తానె పోవునింతియ
కాని। యవియు నిత్యమనుటలరయ కల్ల॥ సీ॥ పల్లెలుపట్టణంబులొకపట్టున మి
క్కిలినల్లసిల్లునా పల్లెలుపట్టణంబులొక పట్టునపాడగునొక్క పట్టునన్।
పల్లెలు పట్టణంబులగు పట్టణముల్ జెడిపల్లెలౌటచే। పల్లెలు పట్టణంబులకు
బాల్పడి నిత్యత గల్గునె గతిన్॥ చ॥ ఒకతరి సస్యసంకలిత మొక్క
తరిన్ననధాన్యసంభృతం। బొకతరి గ్రామసార్థయుత మొక్కతరిన్ వనపర్వ
తోగ్రదం। బొకతరి తాపసోపహిత మొక్కతరిన్ మృగపక్షిపూరితం। బొకత
రిసర్వశూన్యమగుచుండుట దేశము నిత్యమెట్లగున్॥ గీ॥ అవని దినవారపక్ష
మాసాబ్దయుగము। లరుగ దినవారపక్షమాసాబ్దయుగము। లరుగు దెంతను
నశ్శైననదియు రోగ। నిత్యులకు లేమికాలంబనిత్యమరయ॥ మ॥ బలహీనుండ
గువాని రాజ్యములు సంప్రాప్తానుసారంబునన్। బలవంతుండుగ్రహించును
త్కలితసౌభాగ్యంబులొందున్॥ బలవాన్ పృథివీ యటన్నవచనప్రా
గల్భ్యముల్ సిద్ధమై। నిలువన్నింతియకాని రాజ్యములకున్నిత్యత్వముల్ గల్గు
నే॥ క॥ రాజ్యములకు నిత్యత్వము। త్యాజ్యంబని జెప్ప మరియు ధారుణి రా
రాజ్యవిభుత్వంబులకున్। త్యాజ్యము నిత్యత్వము నుడువంబనియే॥ క॥ లో
కములు నిత్యమనుచువి। లోకింప మొదల్భవము గలుగుటదు దినా। లోకంబు

గుట నేహాకంబులని విచారించి మరియు నేతత్సాధనంబులైన కృషివాణిజ్యసే
వా యాచనాదిలౌకికంబులు సుఖప్రదాయకంబులని వివేకించిన ✻ క॥ కాయ
క్లేశంబధిక। వ్యాయామము వాయుసీతవర్షాతపగ। మ్యాయాసంబన్యాసేవా
పాయంబై యుండు దుఃఖప్రదమే కృషియుఁ ✻ క॥ వ్యాజ్యంబనృతాద్యనుచ
యఃభోజ్యము నిజవణిజమునకు పూజ్యము ధర్మ। త్యాజ్యమునైయొప్పెడు వా।
ణిజ్యము బహుదుఃఖములకు నెలవై యుండుఁ ✻ చ॥ కులము గుణంబు శీలము
ను గోత్రము పాత్రము పేరు పెంపు దో। ర్బలము ప్రతిష్ఠయుఁ యశము పౌరుష
ముందగు సాంప్రదాయముఁ। దలపక పెగ్గ లేకమది తక్కువ లెక్కువ లెన్నబో
వక। ఖలజుని నైనగొల్చి మనఁగోరెడి సేవకవృత్తి సౌఖ్యమే ✻ క॥ బిడియంబు
వలపు నెమ్మది। మడిబడ వినయంపు వాక్యముల దైన్యముఁజూ। పడ వేళలర
సి యితరుల నడిగెడు గడు యాచకత్వమగు దుఃఖంబుఁ ✻ క॥ కావున కృష్యా
దికముల। గావింపుట లెన్నతరముగాని క్లేశం। బావిర్భవించు ననియావి। గాకం
పని వాడు సుఖముగాంచు ధరిత్రిఁ ✻ వ॥ ఐనయైహికంబులును। తత్సాధనం
బులైన కృషివాణిజ్యాదిసాధకంబులును మహాదుఃఖప్రాభావికంబులని విలో
కించి మరియును ✻ క॥ ఆముష్మికములనైన। గామించి భుజింపసౌఖ్యకరములట
న్నఁ। యాముష్మికంబులౌసుర। కామినిభోగంబులంద్రదుగా దెధరిత్రిఁ ✻ క॥
ఆలోకసత్యధరవా। నాలింగనరతిసుఖములనారసిచూడఁ। యీలోకసత్యధ
రవా। నాలింగనరతిసుఖములయట్లవెలుంగుఁ ॥క॥ కాయంబుల నెందవుసుఖని।
కాయంబులు స్వర్గసుఖనికాయ్యములగుటఁ। హేయంబులస్థిరాభి। ప్రాయం
బులు సంతతాశుభప్రాయంబుల్ ✻ ॥ ఆలోకస్థులు మరియుఁ। నీలోకస్థులగ
తిన్మదేర్ష్యాగోష్ఠి। చ్ఛాలోభమత్సరాదుల। బ్రేలుచు వర్తింతు రెపుడు ప్రేమ
లు లేకఁ ✻ చ॥ ఒకనిపదంబొకండు గొను నొక్కని భార్యనొకండు గైకొనుఁ।
నొక్కనికొకండు డిట్టుకొను నొక్కనికొక్కడు వధ సేయునం। దొకడు కృశిం
చు సంతసిలు నొక్కడు నంచును జెప్పుచుండ దై। వికములు సౌఖ్యమంచను భ
వింపగ గోరెడి వారి నేమనఁ ✻ గీ॥ అట్లు దుఃఖరూపమైన వేదజ్ఞులె। టదేశం

బులవని నాచరించి। తత్సుఖంబులొందవలపుదురననది। మోహవశత గాకము
క్ష్యముగునె * చ॥ సవనముస్వదుఃఖమది సల్పినసాంతముగా యథావిధం।
బవుటయె దుఃఖమైనమృతమందిన మీదట దత్సుఖాప్తిదా। నవునని వేదము
దెల్పునట్లయినందు దియానో కాదో కే। కవుటగలిగె నేని యది యస్థిరమైన
ను దెంచుచూడగన్ * ఉ॥ కావునసవ్యసాచి కిని కంసవిరోధి సకామ్యులై త్రయీ
భావవిధుల్ క్రతుక్రియల బొల్పడి పుణ్యములందివానిచే। దైవిక భోగసంపదలు
తాలిమితో భుజియించి తత్ఫలా। భావములొందగా మనుజభావమునొందు
చురంచు జెప్పడే * గీ॥ అట్లుగావున పుడమినాముష్మికములకు। సాధనంబు
లైనసవనకర్మ। తతుల విడుచువాడె ధన్యుడశ్లాటత। త్యాంతు వదిలి పరము
గాంతు నేను * వ॥ అని యైహికాముష్మిక భోగంబులయందనురాగంబు వి
రాగంబు నొందించి వెండియు శమదమోపరతితితిక్షాశ్రద్ధాసమాధానంబు
లుగలిగిన వాడుసుఖియని తలంచి * క॥ వెలపల విషయంబులలో। పల కామా
దులజరించు పటు మానసము। కులమలిపి శ్రవణమననా। దుల నిలుపవలెంచు శమ
ము దొరకొనియుండున్ * క॥ విక్రాంతిగ విషయంబుల। కక్రమత జరించు నింద్రి
యములమలిపి నే। నక్రాంతం బాహ్యేంద్రియాం। శ్రవణాదులవహించు దమము
నరింతున్ * ఉ॥ కర్మమొనర్ప జన్మములు గల్గునొ నర్పమిదో పమాటచే। కర్మ
మొనర్చిడించుట మోకాయుపరత్యనుభూతియంద్రుబుల్। మర్మమెరింగి బుద్ధిన
భిమానము లేకన కర్మదృష్టికి। త్యక్తకర్మమొనర్ప నోపరతిగాయని చెప్పు దురాత్మ
వేత్తలున్ * వ॥ అదియునుంగాక * క॥ చింతలకు విషయపట్టులు। శెంతోవడి
నేగుబహువిధేంద్రియములక। త్యంత శ్రవణాదికముని। రంతరమలవరుచుట
యుపరతియంద్రు బుధుల్ * క॥ కావుననిం చేయుపరతి। సేవింపుచు నిత్యసుఖ
ము జెందెదనిమతిన్। భావింపగను పరతిసరి। దైవరలైను సాధనంబులవలంగ
లవే * క॥ నిందించిన సంతతమును భి। నందించిన మేలుకీళ్లో నర్చినదుఃఖం। బొంచ
సుఖమొందనప్రియ। మొందప్రియంబొందసమత నోర్పువహింతున్ * గీ॥ గు
రుని యందు గురుడు గురుతుగా జెప్పిన। మంత్రమందు నదభిమానినైన। దైవమం

బాహ్యోపచారభటులుగాగ। గంగాప్రముఖనాడికలుజలంబులుగాగ షట్కమ
లములుపుష్పములుగాగ। జఠరాగ్నిహోత్రముజ్వలధూపముంగాగ షటు
జీవకళలుదీపంబులుగాగ। నంది నందంబునైవేద్యముంగాగ రవిశశి జ్యో
తులారతులు గాగ। నంగదేవాలయమునసహస్రకమల। పీఠమునశాంతి జన
కపూజసలుపుచు। జలగుపకన్న త్మారాముని రింపుచుంట। తత్వవిదు లీశ్వర
ప్రణిధానమనంద్ర *వ॥ ఇదిగాక ప్రారంభింకనాసనంబులుచతురుత్తరా
శీత్యాసనంబులుగలవందు స్వస్తికాసనగోముఖాసన పద్మాసనవీరాసనసిం
హాసన మయూరాసన కుక్కుటాసన భద్రాసన కూర్మాసన సిద్ధాసనం
బులను దశవిధాసనంబులుముఖ్యంబులవియట్లనిన నాకర్ణింపుము*గీ॥ కొర
లు తన రెండుపిక్కలతోడలనడుమ। నుభయపాదంబులను నిచి కాయ।
మున్నతము జేసినిక్కికూర్చుండ సదియు। స్వస్తికాసనమనబడు జగతిలోన*
గీ॥ వామదక్షిణపృష్ఠపార్శ్వములయందు। నలరుచున్నట్టియంఘ్రులనం
గుళములు। గూడనిదియున్నదియును గోముఖాసనంబన బడుయోగిజనంబు
మెచ్చ॥గీ॥యెడమతొడమీదకుడికాలుయెడమకాలు। కుడితొడను మోపి తత్ప
దాంగుష్ఠములను। పశ్చిమవిధిక్రమమున జేపట్టియురము। నందుచుబుకంబు ని
డుటపద్మాసనంబు *క॥ ఒకయూరువునందొకపద। మొకపదమున నొక్క
యూరువుని శరీరం। బొకచక్కి నిలువనదియో। శుకవీరాసనమటంచు జా
డంబడిచె*గీ॥ వరుసనండధరోరు పార్శ్వములగుల్ఫ। యుగము సవ్యా
పసవ్యమైయుండనిడి భుజాంగుళంబులు మోకాళ్ల జాపినిక్క। వైవివృతా
స్యుడగుటసింహాసనంబు *క॥ రత్నములు భువినిడి। కూర్పరయుగమున నా
భిగూడదహరచినడుమ వం। బరవీధిను న త్తపతి। కొరయుచునుండుటయె నామ
యూరాసనము*గీ॥ కోరిపద్మాసనంబున గూడబట్టి। నట్టిజానూరుమధ్య
ములందుకరము। లునిచిభువిమోపి తనువుమిన్నొరయనిలుప। కుక్కుటాసన
మనబడుగుణగణాఢ్య*గీ॥ఘనతనంధ్వ పార్శ్వయుగ్మమున చాయ।
రెండుగుల్ఫంబులునిచియా రెండుపార్శ్వ। చరణములచేత పీడించి చలన

*వ॥ యిప్పగిదంబునఁ బ్రాణాయామం బభ్యసింపవలయు వెండియుఁ బ్రత్యాహా
రంబు వినుమని యిట్లనియె *గీ॥ కూర్మమవయవములఁ గుదియించుగతిఁ దా । య
మునఁ దనయింద్రియములమరిపి । యాత్మఁ దవరమింపఁ జనుట ప్రత్యాహార । మని
వచింతు రార్యులమలహృదయ *॥ అది యెట్టులన్నఁ గాక *క॥ ఫలలమునఁ జూపు జేగ
ల । నలపరిచిన నట్లునింద్రియమ్ములఁ బులఁచి । తత్కాళల బోఁడఁ జూపి మలపుట । విల
ప్రత్యాహారం నివచింతురు ఘనులు *వ॥ ఇట్లు ప్రత్యాహారలక్షణం బెఱింగించి
వెండియు ధ్యానంబు సగుణ నిర్గుణ భేదంబున ద్వివిధంబగు నది యెట్లనినం జెప్పెద
వినుమని యిట్లనియె *క॥ మానసకమలమునందును । శ్రీ రామ గుణనిమూర్తిఁ
చింతింపు చలో । ధ్యానము సేయుట సగుణ । ధ్యానంబని యండ్రు సుజనులమల
వివేకా *సీ॥ కమలాసనస్థుఁడై కాయంబు నిక్కించి కరయూరులఁ జేర్చి కనులు
మూసి । దేహేంద్రియప్రాణధీమనాదిక మెల్ల దృశ్యమే గాను తద్దృక్కు నేను ।
దృశ్యమే గాను తద్దృక్కు నేననువృత్తి దృశ్యంబుగా తద్దృక్కు నేన । యని విజా
తీయప్రత్యయావృత్తి గా సజాతి ప్రత్యయ ప్రవృత్తిఁ గాంచుచున । నాత్మ నానైవయం
జాకనయ్య శేషదృశ్యదృగ్వృత్తులను నిషేధించుకొనుచు । ననిశము త్మావలో
కనము సేయుచుంట । నిర్గుణ ధ్యానమన జెల్లు నిర్మలాత్మ *వ॥ ఇట్టి ధ్యాన ప్రకారం
బింక ధారణా క్రమంబు వినుమని యిట్లనియె *సీ॥ ఆధారమణిపూరకానాహత
శుద్ధ చక్రాంతస్థలంబులయందె కాని । జీవప్రవర్తన స్థిత్యపేతాష్టదళాంభోజమ
ధ్యంబునందె కాని । భ్రూమధ్యదృష్టిశోభితహృన్మహోదీప్త బిందునాదకళల
యందె కాని । యాజ్ఞాంతరేచకాశ్వాసప్రయోగోపయుక్తాత్మ మంత్రార్థంబునం
దె కాని । భానుకోటిప్రభాభాసమాన । మనసహస్రారకమలంబునందె కాని ।
ప్రబలమగుచిత్తమరికట్టబడుచునుంట । ధారణాయోగమనబడు సర్వనిరత *
వ॥ ఇట్టి ధారణానంతరంబింక సమాధి సవికల్పకంబును నిర్వికల్పంబును నద్వ
యంబుసవికల్పంబు బహిరంతర్దృశ్యశబ్దంబుల ననుసరించి చతుర్వి
ధంబగు నిర్వికల్పంబు బాహ్యాభ్యంతరంబుల ననుసరించి ద్వివిధంబగు నట్లుగుటం
జేసి తత్క్రమంబును క్రమంబునం జెప్పెద నాకర్ణింపుము॥ ... ... ... *

గీ ॥ మొదటగానుపించునెల్లఁజూభాస । కళలుతనకువేరుగావటు
చు । దెలియుతెలివినేపుడు దెలియుటబాహ్యాదృ । శ్యానువిద్ధయనగనల
రువత్స ✻ క ॥ అంతరమగుహృదయంబున । వింతగజూపడెడుకళలవీక్షింపు
చుచూ । సంతసమందుచునుండుట । లంతర్దృశ్యానువిద్ధయనబడుసుమతీ ✻
గీ ॥ బాహ్యమునఁబెక్కుగావినబడెడిశబ్ద । తతులతెలిసెటితెలివియేతాన
టంచు । దెలిసియానందరసమునదేలుచుంట । బాహ్యశబ్దానువిద్ధనాబ
డుమహాత్మ ✻ క ॥ అంతర్హృదయనభంబున । సంతసపడమోయుప్రణ
వశబ్దంబులనా । ద్యంతమువినుతనుదెలియుట । లాంతరశబ్దానువిద్ధయన
బడువత్స ॥ ... ... ... ... ... ... ✻
గీ ॥ బాహ్యదృశ్యశబ్దపటలంబుగనునాత్మ । గనుటబాహ్యనిర్వికల్పమాం
త । రస్థదృశ్యశబ్దరాశిగన్గొనునాత్మ । గనుటలోనినిర్వికల్పమనఘ ✻ వ ॥
యిదిసమాధిప్రకారంబు వరియించును ✻ క ॥ యమనియమాదులచేని । ట్లు
మరెడియభ్యాసయోగమదిగొనచిత్తం । బమలంబగుననణిమాద్య । త్తము
సిద్ధులుగలుగునవ్విధంబెట్లనినన్ ✻ క ॥ వినుమణిమయనంగమహిమ । య
నగరిమయన్గాగలఘిమయనప్రాప్తియనం । గనుప్రాకామ్యేశత్వము । ల
నగవశిత్వమునసిద్ధులష్టవిధంబుల్ ॥ ... ... ... ... ...✻
వ ॥ అదియెట్లంటేని ✻ సీ ॥ అణుజంతువులయందు నణువై చరించుట లణి
మాహ్వయైశ్వర్యమలఘుచరిత । యబ్జజాండాదిమహన్మహుండై యుంట
మహిమాఖ్యభూతినిర్మలవిచార । బ్రహ్మాండమునకంటెభారమై యుండుటగ
రిమాఖ్యసంపత్తికలుషదూర । యమరాద్రిసదృశుడై సూక్ష్మగతినుంట
లఘిమావిభూతిసల్లలితహృదయ । వాంఛితార్థావలంబనావాప్తిప్రా
ప్తి । గగనగమనాదిసిద్ధిప్రాకామ్యహర్ష । శశిముఖనియామకత్వమీశ
త్వమఖిల । జీవవశ్యప్రవృత్తివశిత్వమనఘ ॥ ... ... ✻
వ ॥ యిట్లభ్యాసయోగంబువలన నణిమాదిసిద్ధులు సిద్ధించు నింతియె

గద్యము.

ఇతి శ్రీమద్గురులింగమూర్తి చరణ కమల సేవావిధేయ తద్గురుకటాక్ష వీక్షణానుగ్రహోపలక్షిత శ్రీరామమంత్రోపాసనాప్రకార జ్ఞానధౌరేయ తన్మంత్రాధిష్ఠానదేవతా తత్త్వానుసంధాన లక్షణ భాగధేయ వేదాంతకవితా విచిత్ర విజ్ఞేయ బ్రహ్మవిద్విజ్జనగేయ పరశురామపంతుల రామమూర్తి నామధేయ ప్రణీతంబయిన శుకచరితంబను వేదాంతగ్రంథంబునందు తృతీయాశ్వాసము ॥ *

---

శుకచరిత్రమునందలి

తృతీయాశ్వాసము

ముగిసెను.

---



శ్రీరస్తు



శ్రీహయగ్రీవాయనమః

శ్రీ సీతారామచంద్రగురుపరబ్రహ్మణేనమః

శుకచరిత్రము

చతుర్థాశ్వాసము



శ్రీమదయోధ్యాపట్టణ। ధామసహస్రాయుతోష్ణధామసమపరం।
ధామయశోనిర్జితహిమ। ధామాసుగుణాభిరామదశరథరామా ॥

గీ॥ అవధరింపుము పాండుపుత్రాగ్రజునకు। నాపగాపుత్రుడిట్లని యానతి
చ్చె। నట్లు ముని రాజయోగమాత్మానుభవము। దానుచు జెప్పిన విని శుకుడని
యెనిట్లు॥ క॥ మునివర యాత్మజ్ఞానంబనునదియే రాజయోగమనుదిము క్తికిసా।
ధనమని జెప్పితిరదిగాన। ననువుగ తత్క్రమము తెలియ నానతియీవే॥ వ॥ అనిన
యావ్యాసనందనుండిట్లనియె॥ ఉ॥ యోగిజనాశ్రితానిలని యోగము సాధక ల
క్ష్యలక్షణో। ద్యోగము దేహతత్త్వవిని యోగము సంతతముక్తికామినీ। భోగ
ము నిత్యసత్త్వగుణ పూగము దృష్టపరాత్మజీవసం। యోగము నొందజేయు
భవయోగవియోగము రాజయోగముల్॥ క॥ యీ రాజయోగమార్గం। బేర
రసికులెరుంగరెరిగిరేని యొడుసం। సారభయముడిగి పరత। త్వాగూఢనిముక్తు
లగుదురపుడె తలంపఁగ॥ క॥ యాగంబునకంటెను శ్రుతి। భాగంబునకంటె భ
క్తిభావనకంటెన్। యోగంబునకంటెను ఘన। యోగంబీ పరమ రాజయోగ
మువత్సా॥ క॥ ఘనమురహస్యంబుత్తమ। మనుభవమై యొప్పు మరియు నవ్యా

